# శోణ పద్మం

[సాంఘిక నాటిక]



రచన:

పి. దుర్గారావు, యం. ఓ. యల్.,

ప్రథమ ముద్రణము :
500 ప్రతులు

సర్వస్వామ్యములు రచయితవి.

రుధిరోద్గారినామ సంవత్సరము

హేమంతము — పుష్యమాసము
జనవరి — 1984.

మూల్యము : మూడురూపాయలు.

ముద్రణ :
"వేంకటరత్నా" విజయవాడ-2

---

## ఇందలి పాత్రలు :

| | |
|---|---|
| ప్రసాద్ : | [నాయకుడు] |
| సుచిత్ర [మరోపేరు శైలజ] | [నాయిక] |
| అయోధ్యరామయ్య: | [ప్రసాద్ తండ్రి] |
| రాజ్యలక్ష్మి : | [ప్రసాద్ తల్లి] |
| పరిమళం: | [ఒక వేశ్య] |
| రంగడు : | [పరిమళానికి తమ్ముడు] |
| పోలీసు ఇన్‌స్పెక్టరు : | [ప్రభుత్వోద్యోగి] |
| గోపాలరావు | [ఇంటి యజమాని] |

# వినయ వాక్యము

ఈ నాటికను ఏడెనిమిది సంవత్సరముల క్రిందట వ్రాసితిని. ఈ నాటికను చూచి ఒకరిద్దరు మిత్రులు నవలగా వ్రాయవలసినదని ప్రోత్సాహ పరచిరి. నవలగా కొంత భాగము వ్రాసితిని. కాని నవలను ప్రచురించుట వ్యయ ప్రయాసలతో కూడిన పని యగుటవలన వ్రాసిన నాటికను యధాతధముగా ప్రచురించుచున్నాను.

పడుపువృత్తి మన సమాజములో ఒక దురాచారము. మన యుగపురుషులు శ్రీ కందుకూరి, గురజాడ, చిలకమర్తి, పానుగంటి, రఘుపతి వేంకటరత్నం నాయుడు, మున్నగువారు తమ రచనలతోడను, ప్రబోధములతోడను పడుపువృత్తి నిర్మూలనముకొరకు ఎంతో కృషి చేసిరి. అయినను నేటికిని యీ దురాచారము సంఘాన్ని పీడిస్తూనేవుంది.

పడుపువృత్తిని నిర్మూలించుట అవసరమని వేరుగా చెప్పనవసరము లేదు. ఆదృష్టితోనే యీ నాటిక రచింప బడినది.

మహాపండితులు, కవులు కీ. శే. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు రచించిన నాగానందంలోని 'ఆరవిచ్చిన తమ్మి' యను గౌరీదేవి ప్రార్థనా గీతమును రెండు మారులు యీ నాటికలో ప్రయోగింపబడినది. వారికి వినయ పూర్వక శ్రద్ధాంజలులు!

సహృదయులను ఈనాటిక ఏమాత్రము రంజింప జేసినను కృతకృత్యునిగా భావించుకుందును.

— రచయిత.

సమర్పణము:

తెలుగు దేశంలో

నూతన సమాజావిర్భావంకోసం

సాంఘిక దురాచారాలను రూపుమాపడంకోసం

ఎనలేని కృషి చేసిన

శ్రీ రఘుపతి వేంకటరత్నం నాయుడుగారికి

ప్రణామాంజలులతో.

# శోణ పద్మం

[సాంఘీక నాటిక]

## [ప్రథమ రంగము]

(గదిలో ఒక టేబిలు రెండు కుర్చీలుండును. ఒక ప్రక్క మంచము వేసియుండును. ఒక మూలకు కొంకికి నల్లని ఓవర్ కోటు ఉండును. టేబిలు మీద కొన్ని పుస్తకము లుండును. నిశ్శబ్ద వాతావరణము, ప్రసాద్ ఒక కుర్చీలో కూర్చొని చదువుకొనుచుండును.)

[తెర యెత్తబడును]

వెలుపలి నుండి స్త్రీ గొంతుక: ఏమండీ! తలుపు తీయండి! త్వరగా తీయండి. (తలుపు తట్టిన శబ్దం వినిపించును)

ప్రసాద్: (లేచి-తనలో) ఎవరది ? ఈ అర్థరాత్రివేళ తలుపు కొడుతున్నారు? ఎవరిదో స్త్రీ గొంతుకలావుంది. (ప్రకాశముగా) ఎవరది? ఎవరండీ మీరు?

స్త్రీ గొంతుక : (వెలుపలనుండి) నే నెవరినయినదీ తరువాత చెబుతాను. ముందు త్వరగా తలుపుతీయండి! అపాయంలో వున్న అబలను) త్వరగా తలుపుదీసి నన్ను రక్షించండి!

(తలుపు తట్టిన శబ్దం మరల వినిపించుచుండును)

ప్రసాద్ : మీరెవరో ముందుగా మీ పేరు చెప్పండి. ఇంత అర్థరాత్రివేళ ఎందుకు వచ్చినట్లు? మీరెవరో చెప్ప నిదే తలుపు తీయను.

స్త్రీ గొంతుక : అయ్యా! నేనొక అనాధను! పేరు సుచిత్ర. దుండగులు వెంబడిస్తున్నారు. నన్ను రక్షించండి! లోపలకు వచ్చిన తరువాత మీకంతా వివరంగా చెబుతాను. ముందు తలుపు తియ్యండి దుండగులు దగ్గరగా వస్తూ వున్నారు. త్వరగా తలుపుదీసి నా శీలాన్ని రక్షించండి!

(ప్రసాద్ తలుపుతీయును సుచిత్ర లోనికి ప్రవేశించును)

ప్రసాద్ : (సుచిత్రను పరికించి చూచి) ఎవరు నీవు ? ఇంత అర్థరాత్రివేళ ఒక స్త్రీ ఒంటరిగా ఈ విధంగా రావచ్చునా ?

సుచిత్ర : మీరెవరు ? మీ పేరు ?

ప్రసాద్ : బి.ఇడి. ట్రైనింగ్ పొందుతున్న ఒక విద్యార్థిని. నాపేరు శివప్రసాద్! అందరూ ప్రసాద్ అని పిలుస్తారు

సుచిత్ర : ఈ యింట్లో మీరు తప్ప మరెవరు లేరా?

ప్రసాద్ : లేరు.

సుచిత్ర : అయితే ముందు నన్ను మీ గదిలో యెక్కడయినా తలదాచుకోవడానికి స్థానం యివ్వండి. నన్ను వెంబడిస్తున్న దుండగులు మీ గదిలో నేను ప్రవేశించడం చూచారేమో! నన్ను రక్షించండి. ఆ దుండగులు వెళ్ళిపోయిన తరువాత నా కథంతా మీకు చెబు

తాను. ఈ మంచం క్రింద తలదాచుకోమంటారా ?

ప్రసాద్ : వద్దు, ఆ వచ్చేవాళ్ళు తప్పకుండా మంచంక్రింద చూస్తారు. అదిగో నా బ్లాక్ ఓవరుకోటు తలుపు ప్రక్కన కొంకికి తగిలించివుంది. దాని చాటున నిలబడు. ఎవరికీ కనబడవు. త్వరగా! బయట యేదో శబ్దమవుతోంది. ఆ దుండగులేమో! త్వరగా వెళ్ళు! నీవు కనబడకుండా ఆ ఓవర్‌కోటును కప్పతాను.

(సుచిత్రమూలకుబోయి నిలబడును. ప్రసాద్ ఓవర్ కోటును సుచిత్రపై వేసి కనబడకుండాజేయును. ప్రసాద్ యథాప్రకారము కుర్చీలో కూర్చుని చదువుకొనుచుండును)

(రౌడీ రంగడు ఇద్దరు ముగ్గురు రౌడీలతో ప్రవేశించును)

రౌడీ రంగడు : (ప్రసాద్‌తో) ఓహో! ఎవరయ్యా నువ్వు ? ఏమీ యెఱుగనట్లు చదువుతున్నావే! ఏదీ ఆ పిల్ల?

ప్రసాద్ : ఏ పిల్ల ?

రంగడు : అదే ఇప్పుడు లోపలికొచ్చిందే ఆ పిల్ల! ఎక్కడ దాచావో చెప్పు! అ పిల్లను బయటికి పంపు! లేక పోతే ఆ పిల్లపనీ, నీ పనీ యేమవుతుందో తెలుసుకో! నా పేరేమిటో తెలుసా?

ప్రసాద్ : తెలియదు.

రంగడు : రౌడీ రంగడు! నా సంగతి నీకు తెలియకపోతే ఊళ్ళో అడిగి తెలుసుకో! త్వరగా చెప్పు! ఆ పిల్లని యెక్కడదాచిపెట్టావో ?

ప్రసాద్ : పిల్లవచ్చిందా ? పిల్లి వచ్చిందా ? త్రాగిన మత్తులో నీకేమీ తెలియడం లేదు. నాకేం తెలుసు మీ పిల్ల సంగతి ? కావలిస్తే గదంతా చూచు కోండి.

రంగడు : (ప్రక్కన వున్న రౌడీలతో) అరేయ్! ఈయన మాటలకేంగాని గదంతా చూడండిరా. ఆ మంచం క్రింద, ఈ టేబుల్ క్రింద, తలుపుచాటున, స్నానాల గదిలో అంతా చూడండి.

ప్రసాద్ : నీకు తాగిన మత్తులో తల తిరుగుతోంది. ఇప్పుడే పోలీసు స్టేషనుకు ఫోను చేస్తాను.

రంగడు : చేశావు లేవయ్యా ఫోను. పోలీసులు మమ్మేల్నేం చేస్తారు ? వెదకండిరా ఇల్లంతా.

(రౌడీలు ఇల్లంతా వెదకి నిరాశ జెంది ప్రసాద్ దగ్గఱకు వస్తారు)

ప్రసాద్ : దొరికిందా ఆ పిల్ల?

రంగడు : మా పిల్ల ఒకతె యీ యింట్లోకి వచ్చినట్లు అను మానపడ్డాం. ఎప్పుడు, ఎక్కడ, బోల్తాపడని రంగడు నీ దగ్గఱ బోల్తాపడ్డాడు! వెళ్ళొస్తాం. ఏమీఅనుకోకు.

ప్రసాద్ : వెనుకటికొకడు చెంపమీద ఛెళ్ళున కొట్టి క్షమించమని చేతులు పట్టుకున్నాడట, అలా వుంది నీ పని! ఇంక దయచెయ్యి.

రంగడు : వెళ్ళొస్తాం! మళ్ళీ కలుసుకుందాం.

(రంగడు రౌడీలు వెడలి పోవుదురు)

(ప్రసాద్ తలవు వేసి, సుచిత్ర పైకప్పిన ఓవరు కోటును తొలగించును.)

ప్రసాద్ : ఓ శ్రీదేవిగారు! మీ నీలి ముసుగును తొలగించి మీ ముఖచంద్రుణ్ణి చూపించండి ఇంక నిజ స్వరూపాన్ని బయటపెట్టండి.

సుచిత్ర: అమ్మయ్య! రౌడీలు వెళ్ళిపోయారా? నన్ను దుండగుల నుండి రక్షించారు. కోటి జన్మలెత్తినా మీ ఋణం తీర్చుకోలేను.

ప్రసాద్ : కోటి జన్మలెత్త నవసరం లేదు. ఈ జన్మలోనే ఋణమంతా తీర్చుకుందువు గాని, ముందు నీ కథ వినిపించు.

సుచిత్ర : ఏ కథ?

ప్రసాద్ : నీ కథ! అసలు నీ వెవరు? ఈ అర్ధరాత్రి వేళ యీ విధంగా వీధుల్లో తిరుగుతు, ఇతరుల యిళ్ళల్లో ప్రవేశించే నీకు బుద్ధి చెప్పాలి! నిన్ను పోలీసుస్టేషనుకు అప్పగించుతాను. నీ పేరేమిటో మళ్ళీ తెలుపు!

సుచిత్ర : నా పేరు తెలుసుకుని మీరేం చేస్తారు? మీ పేరేమిటో ముందు చెప్పండి!

ప్రసాద్ : నా పేరు శివప్రసాద్. అందరు ప్రసాద్ అని పిలుస్తారు. నీ పేరు చెప్పు! నిన్ను పోలీసులకు అప్పగించాలి!

సుచిత్ర : నా పేరు సుచిత్రని యింతకు ముందే చెప్పాను! నన్ను అపాయమునుండి కాపాడిన మీరు నన్ను పోలీసులకు అప్పగించలేరు. మీరు నన్ను నిజంగా పోలీసులకు అప్పగించి నట్లయితే ఏమని చెబుతానో తెలుసా?

ప్రసాద్ : ఏమని చెబుతావు?

సుచిత్ర : మీరు నా భర్త అని చెబుతాను.

ప్రసాద్ : ఇది యింకా బావుంది! నేను నీకు భర్త నెట్లా అవుతాను?

సుచిత్ర : ఇంత చదువుకున్న మీరు ఇంత తెలివితక్కువగా మాట్లాడడం చిత్రంగా వుంది! మీరు నన్ను ఆపద నుండి రక్షించారు! భరించే వారిని భర్త అంటారు. మీరు నన్ను రక్షించి భరించారు. భర్త కాక మరే మవుతారు?

ప్రసాద్ : చాలుగాని నీ తెలివితేటలు ! నీ అసలు సంగతే మిటో వినిపించు!

సుచిత్ర : తెలుసుకుని మీరేం చేస్తారు? ఆదుస్తారా? తీరుస్తారా? నా గతికి నన్ను వదిలేయండి!

ప్రసాద్ : నీ గతికి నిన్ను వదలక నేనేం చేశాను? అర్ధరాత్రి వేళ నా గదిలో ప్రవేశించిన నిన్ను, దుండగులనుండి శీలాన్ని, మానాన్ని రక్షించిన నిన్ను నీ వెవరని ప్రశ్నించడం కూడా తప్పేనా? సరే! చెప్పకు! దాచి వుంచుకో! ఇంక బయటికి నడువు!

సుచిత్ర : ఇప్పుడు మీరు నాకొక చిన్న సహాయం చేయాలి!
ప్రసాద్ : (కోపంతో) ఆర్చేవాణ్ణీ, తీర్చేవాణ్ణీ నేను కాదుగా!
సుచిత్ర : ప్రసాద్ గారు! జీవితంలో బయటికి చెప్పకూడని కొన్ని విషయాలు వుంటాయి. అవి తెలియజేస్తే అభిమానం దెబ్బ తింటుంది! సిగ్గుతో తల వంచుకోవలసి వస్తుంది. ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుంది.

ప్రసాద్ : నీలో అంతటి గంభీర రహస్యాలు వున్నాయన్న మాట! మరిప్పుడు నేను నీకు ఏమి సహాయం చేయాలి?

సుచిత్ర ; నన్ను తక్షణం యీ రాత్రికే యీ వరంగల్లునుండి ఏ విజయవాడకో—హైదరాబాదుకో రైలుమీదో—బస్సుమీదో పంపించండి! స్టేషనుదాకా వచ్చి నన్ను రైలు ఎక్కించండి!

ప్రసాద్ : ఎందుకని?

సుచిత్ర : ఇప్పుడు వచ్చిన రౌడీలు నన్ను చూస్తే పట్టుకుపోతారు! నన్ను బ్రతుకనివ్వరు. నేను ఒకవేళ వారి చేతుల్లో జిక్కితే నేనే ఆత్మహత్య చేసుకుంటాను. ఆ జీవితం నాకొద్దు ప్రసాద్ గారు! ఆ వ్యభిచార వృత్తి నాకొద్దు! నన్ను రక్షించండి! నన్ను కాపాడండి! వెంటనే నన్నిచ్చటి నుండి యెచ్చటికైనా పంపించండి!

ప్రసాద్ : సుచిత్రా! భయపడకు! నీకేం భయం లేదు. ఆ రౌడీలే కాదు; వేయి మంది కీచకులు వచ్చినా నిన్ను

కాపాడుతాను. అసలు నీ వెవరో వినిపించు! నీకు ఆ కొడీలకు వున్న సంబంధం ఏమిటో వినిపించు! వినిపించు సుచిత్రా! వినిపించు!

సుచిత్ర: వినిపించమంటారా? నా కథ వినిపిస్తే మీరు నన్ను అసహ్యముగా చూస్తారు. నేను — ఒక వేశ్య కుమార్తెను.

ప్రసాద్: అంతేగా! ఒక వేశ్య కుమార్తెవు! తరువాత?

సుచిత్ర: పడుపు వృత్తి చేసేవారిని మీరు అసహ్యించుకోరా?

ప్రసాద్: అసహ్యపడను. వారిపై సానుభూతిని చూపిస్తాను. వారి హీనస్థితిని జూచి బాధపడతాను. అయితే అందఱినీ ఆ విధంగా చూడను. పరిస్థితుల ప్రభావం చేతను, దుర్భర దారిద్ర్యం చేతను ఆ వృత్తిలో జారిపడిన వారిని చూచి మాత్రమే జాలిపడతాను. విలాసాల కోసం—ధన సంపాదన కోసం తాము పతనమయి, యితరులను పతనం చేసేవారిని చూచి ద్వేషిస్తాను.

సుచిత్ర: ప్రసాద్ గారు! నేను ఇంతవఱకు యీ వృత్తిలోనికి దిగలేదు. నన్ను మాఅమ్మ యీ వృత్తిలోనికి దింపాలని యత్నిస్తున్నది. వేధిస్తున్నది.

ప్రసాద్: నీకు పడుపు వృత్తి యిష్టంలేదన్న మాట!

సుచిత్ర: అవును! నాకు పడుపువృత్తి యిష్టం లేదు. నాకు సంసార స్త్రీలకు వలె పెళ్ళి చేసుకోవాలని వుంది. గృహిణిని కావాలని వుంది. నాకు భర్త కావాలి!

అతడెటువంటి వాడయినా సరే! నాకు పెళ్ళి కావాలి! భర్త కావాలి! గృహ జీవితం కావాలి!

ప్రసాద్ : మఱిప్పుడు వచ్చిన ఆ రౌడీలెవరు?

సుచిత్ర : ఆ వచ్చిన రౌడీ రంగడు మా అమ్మకు తమ్ముడు. పచ్చి రౌడీ! త్రాగుబోతు!

ప్రసాద్ : అయితే మీ అమ్మ నిన్ను వ్యభిచార వృత్తికి ప్రోత్సహిస్తున్న దన్నమాట!

సుచిత్ర : అవును!

ప్రసాద్ : అది భరింపలేక యిలా పారిపోయి వస్తున్నావన్న మాట!

సుచిత్ర : ఆమె కిదే వృత్తి! నా వయసుకల పిల్లలు ఇద్దరు ముగ్గురున్నారు. వారిచేత యీ వృత్తి చేయిస్తూ వుంటుంది!

ప్రసాద్ : మఱి నీవెందుకు ఈ వృత్తిలోనికి దిగలేదు?

సుచిత్ర : ఎందుకనో చిన్నప్పటినుండి యీ వృత్తి అంటే నాకసహ్యాం! మా అమ్మతో యెన్నోసార్లు ఈ వృత్తి మానమని పోట్లాడాను, కాని ఆమె నా మాట వినేది కాదు.

ప్రసాదు : మఱి ఈ రోజు ఎందుకని ఇలా పాఱిపోయి వస్తున్నావు?

సుచిత్ర : ఒక బంగారు వర్తకుడు నా అందచందాలను జూచి మోహించాడు. నేను దప్ప మఱెవరు పనికిరార న్నాడు. ఎంత డబ్బయినా గ్రుమ్మరిస్తానన్నాడు.

మా అమ్మ డబ్బుకాశపడింది, నన్ను ఆ కామ
పిశాచానికి బలి యివ్వడానికి ఒప్పుకుంది. నేను ఎంత
ప్రతిమాలినా వినలేదు. తల్లి కాదు, రాక్షసి!

ప్రసాదు : ఆమె నీ కన్నతల్లేనా? కన్నతల్లి అయినట్లయితే
అట్లా చేసి వుండేది కాదు!

సుచిత్ర : ఏమో! ఆ విషయం నాకు పూర్తిగా తెలియదు.
ఆమె కన్నతల్లి కాదనీ పెంచిన తల్లియనీ యెవరో
చెప్పారు?

ప్రసాదు : తరువాత ఏం జరిగింది?

సుచిత్ర : నన్ను బలవంతంగా పడకగదిలో వేసి తాళం
వేశారు. నేను పారిపోకుండా రంగడు, మొదలైన
రౌడీలను కాపలా వుంచింది.

ప్రసాద్ : ఆ సాలె గూడునుండి నీవు ఎట్లా బయటపడ్డావు?

సుచిత్ర : నేను కిటికీ తలుపులు బ్రద్దలుకొట్టి, గోడ దూకి
బయటపడ్డాను.

ప్రసాదు : తరువాత?

సుచిత్ర : నేను అర్ధరాత్రి రోడ్డుమీద పరుగులు తీసాను.
దుండగులు నన్ను వెంబడించారు. మీ యింటిలో
దీపం వెలుతురు బయటికి కనిపిస్తూ వుంది. తలుపు
కొట్టి, మిమ్మల్ని పిలిచి, శరణు వేడాను. మీరు నా
మానాన్ని శీలాన్ని కాపాడారు. దుండగుల బారి
నుండి రక్షించారు. మీది చల్లని హృదయం. మీకు
పెళ్ళి కాకపోతే చక్కని చుక్క, చందనపు బొమ్మ,

లాంటి పెళ్ళికూతురు నివ్వాలని భగవంతుణ్ణి కోరుకుంటున్నాను.

ప్రసాద్ : చక్కని చుక్కా వద్దు, చందనపు బొమ్మా వద్దు.
సుచిత్ర : మరేం కావాలి?
ప్రసాద్ : నీలాంటి పెళ్ళికూతురు కావాలి!
సుచిత్ర : నాలాంటి పెళ్ళికూతురు కావాలా?
ప్రసాద్ : అవును! నీలాంటి పెళ్ళికూతురు కావాలి!
సుచిత్ర : అంత అందంగా వున్నానా నేను?
ప్రసాద్ : అందమో చందమో నాకు తెలియదు. పద్మం లాంటి నీ ముఖం, నల్ల కలువలవంటి నీ రెండు కళ్ళు బుగ్గమీద వున్న ఆ పుట్టుమచ్చ నన్ను వశపరచుకున్నవి. మరి నీవు విజయవాడకు వెళతానన్నావు. విజయవాడలో ఎవరున్నారు?

సుచిత్ర : మీది విజయవాడా?
ప్రసాద్ : కాదు! నల్లగొండ.
సుచిత్ర : మరి ఈ హనుమకొండలో ఎందుకుంటున్నారు?
ప్రసాద్ : నేనిక్కడ బి.ఇడి, ట్రైనింగు పూర్తిచేస్తున్నాను. ఈ ట్రైనింగు ఇంకా మూడు మాసాలలో పూర్తవుతుంది. తరువాత నేను స్వతంత్రముగా ఒక ఆదర్శ పాఠశాలను నడుపదలుచుకున్నాను.

సుచిత్ర : మంచిది! నన్ను రాత్రే ఇప్పుడే నన్నిక్కడినుండి ఎక్కడికయినా పంపించండి! మళ్ళీ ఆ రౌడీలు ఇచ్చటికి రావచ్చును కూడ! వచ్చినట్లయితే నాకు, మీకు అనేక చిక్కులు ఎదురవుతవి!

ప్రసాద్ : వచ్చే చిక్కులు తీర్చేవాణ్ని నేనున్నానుగా! నీ కెందుకంత భయం? విజయవాడ వెళతానన్నావు! విజయవాడ వెళ్ళి నీవేం చేస్తావు?
సుచిత్ర : ఏదయినా పని చేసుకు బ్రతుకుతాను!
ప్రసాద్ : నీకేం పనులు వచ్చునో తెలుసుకోవచ్చునా?
సుచిత్ర : ఆడవాళ్ళు సాధారణంగా జేసే వంట_వడ్డన. అన్ని పనులు వచ్చును. అంతేగాదు, నృత్యం. సంగీతంలో రెండు కొంత కొంత తెలుసును.

ప్రసాద్ : నృత్యం, సంగీతం నీ వెవరి దగ్గర నేర్చుకున్నావు?
సుచిత్ర : కూచిపూడినుండి వరంగల్లుకు వచ్చి స్థిరపడిన ఒక శాస్త్రిగారి దగ్గర నేర్చుకున్నాను.
ప్రసాద్ : నీకు యెవరి పాటలు పాడుతు అభినయించటం ఇష్టం?

సుచిత్ర : జయదేవుని యష్టపదులంటే నాకు చాల ఇష్టం.
ప్రసాద్ : అభినయం సంగతి నాకు తెలియదుగాని సంగీతం నాకు కూడా కొద్దిగా ప్రవేశం వుంది. జయదేవుని యష్టపదులను నేను కూడా చదివాను. ఒకటి రెండు గీతములను గూడ కంఠస్థం చేశాను.

సుచిత్ర : కంఠస్థం కూడా చేశారా?

ప్రసాద్ : అవును! జయదేవుని యష్టపదులలో నీకు నచ్చిన గీతాన్ని చెప్పు!

సుచిత్ర : జయదేవుని యిరువది నాలుగు అష్టపదులు నాకెంతో ఇష్టం! "యామిహే! కమిహ శరణమ్!

సఖిజన వచన వంచితాహమ్" అనే విరహగీతం నాకెంతో ఇష్టం! మఱి మీకో?

ప్రసాద్ : "హరి హరీ! హతాదరతయా! సాగతాకుపితేవా" అనే గీతం నాకు చాలా ఇష్టం. మఱి తెలుగుకవుల గీతాలు నీకు ఇష్టం లేదా?

సుచిత్ర : మఱెందుకు ఇష్టం లేదు? కృష్ణశాస్త్రిగారి "మ్రోయింపకోయ్ మురళి", విశ్వనాథవారి "కిన్నెరసాని పాట", నండూరివారి "యెంకి పాటలు", శ్రీశ్రీ గారి "ఆనందం అర్ణవమైతే" అనే పాటలు నాకు చాల ఇష్టం.

ప్రసాద్ : పాఠశాలకు వెళ్ళకుండానే ఇదంతా నేర్చుకున్నావా?

సుచిత్ర : అవును! శ్రీ శాస్త్రిగారి శుశ్రూష వలన నాకీ సంస్కారం అబ్బింది.

ప్రసాద్ : అయితే నీకు జీతం ఎంత కావాలి?

సుచిత్ర : నాకు జీతం, బత్తెం ఏమీ వద్దు! అన్నం, బట్టలు ఇస్తే మీలాంటివారికి జీవితాంతం సేవ చేస్తాను!

ప్రసాద్ : నీకు అన్నం బట్టలు ఇస్తాను. నాకు సేవ చేస్తావా?

సుచిత్ర : మీకా?

ప్రసాద్ : అవును! నాకే!

సుచిత్ర : మఱి నన్నేం చేసుకుంటారు?

ప్రసాద్ : నాకు మనసు కలిగినపుడు పాటలు పాడించుకోవడానికి, నృత్యం చేయించుకోవడానికి!

సుచిత్ర : నా పాటలు, నా నృత్యం వలన మీరు పిచ్చి వాళ్ళవుతారు! లోకాన్ని మరిచిపోతారు. అనార్కలీని ప్రతిష్ఠించడగానే సమాధి కట్టినట్లుగానే నాకుకూడ మీ తల్లిదండ్రులు సమాధి కడతారు!

ప్రసాదు : ఇది ఆనాటికాలం కాదు సుచిత్రా! నా తల్లి దండ్రులు నిన్ను అక్కున జేర్చుకుంటారు.

సుచిత్ర : పన్నెండు గంటలు కావస్తున్నది. త్వరగా రైలు స్టేషనుకు నడవండి! నన్ను రైలెక్కించి వత్తురుగాని ! మీకు పుణ్యం వుంటుంది!

ప్రసాదు : పుణ్యం వుండబట్టే నీవు నాకు దొరికావు. సుచిత్రా! నిన్ను నేను వదిలి పెట్టను. ఏవీ నీ చేతులు ? పాణిగ్రహణం చేయనివ్వు! నువ్వే పెళ్ళి కోసం తపిస్తున్నావో ఆ పెళ్ళి నేను చేసుకుంటాను, నువ్వే భర్తకోసం పరితపిస్తున్నావో ఆ భర్తను నేనవుతాను. నిన్ను పెళ్ళి చేసుకుంటాను! సుచిత్ర నేను నీకు భర్తనవుతాను.

సుచిత్ర : ప్రసాదుగారు! నన్ను మాటలతో అవమానించకండి! నేను మీకు భార్యను కాలేను! మీరు నాకు భర్త కాలేరు!

ప్రసాదు : ఎందుకని సుచిత్రా ? ఎందుకని ?

సుచిత్ర : మీరు ఉన్నత కుటుంబానికి చెందిన ఉత్తమ కులస్థులు. నేను పడుపువృత్తి కులానికి చెందిన ఒకపతితను.

ప్రసాదు : సుచిత్రా ! నా దృష్టిలో నీవు పతితవుకావు, పావనమూర్తివి !

సుచిత్ర : అంత మాట అనబోకండి! ప్రసాదుగారు! అంత మాట అనబోకండి! మన వివాహం సమాజం అంగీకరించదు, మా తల్లిదండ్రులు, బంధువులు అంగీకరించరు.

ప్రసాదు : ఎవరు అంగీకరించినా, అంగీకరించకపోయినా నీ కోసం సర్వం త్యాగం చేస్తాను. ఎవరెన్ని కష్టాలు పెట్టినా సహిస్తాను. నీవు నాతో కలిసి పయనిస్తావా లేదా చెప్పు ?

సుచిత్ర : నా కోసం మీరెందుకు కష్టాలు కొని తెచ్చుకుంటారు. ప్రసాదుగారు? గొప్ప ధనవంతుల బిడ్డను, కులీనయువతిని పెళ్ళి చేసికొని సుఖంగా కాపురం చెయ్యండి! జీవితమనేది సుఖపడడానికి! ప్రసాదుగారు! సుఖ పడడానికి! కష్టాలు కొని తెచ్చుకోవడానికి కాదు!

ప్రసాదు : సుచిత్రా ! నేను జీవితంలో ఇంత వఱకు ఎవరినీ ప్రేమింపలేదు. ఇంత స్వేచ్ఛగా యెవరితోను మాట్లాడలేదుకూడ. నిన్ను తప్ప! నీతో తప్ప ! నిన్ను పెళ్ళిచేసుకుంటాను.

సుచిత్ర : ప్రసాదుగారు! ఇంత గొప్పత్యాగం నాకోసం మీరెందుకు చెయ్యాలి ? నన్ను మీరు పెళ్ళి చేసుకున్నట్లయితే మీరు మీ తల్లిదండ్రులకు దూరం కావలసి వస్తుంది! సంఘాన్ని యెదిరింపవలసివస్తుంది! అనేక కష్ట నష్టాలను ఎదుర్కొనవలసివస్తుంది. తుఫాను పెనుగాలులను ఎదుర్కొనవలసి వస్తుంది

ప్రసాద్ : అన్నిటినీ సంతోషంగా ఎదుర్కొంటాను. చిఱు నవ్వులతో సహిస్తాను.

సుచిత్ర : ముక్కు మొఖం తెలియని నా కోసం మీరెందుకు కష్టాలుపడాలి ? నాలాంటి అనాధలు ఈ సమాజంలో కోకొల్లలు. పవిత్రంగా గృహ జీవితం గడపాలనే అనేక మంది స్త్రీలు ఈ పడుపువృత్తికి బలియవుతున్నారు. కొంతమంది విలాసవంతుల సంపదకు ఎఱ అవుతున్నారు. నా గురించి బాధలు కొని తెచ్చుకోకండి ప్రసాదుగారు! ప్రస్తుతానికి నా శీలాన్ని, మానాన్ని కాపాడారు! ధన్యవాదాలు! స్టేషను వఱకు వచ్చి, నన్ను రైలెక్కించండి!

ప్రసాద్ : నా మీద విశ్వాసం లేదా సుచిత్రా ? ఒంటరిగా పురుషుడు జీవించగలడు, కాని స్త్రీ జీవించడం అసాధ్యం! వృక్షం ఆధారం లేకుండా మనగలుగుతుంది. కాని తీగెకు ఏదో ఒకఆధారం, ఆశ్రయం అవసరం! నీ శీలాన్ని రక్షించాను; నీ జీవితాన్ని గూడ తీరం జేరుస్తాను సుచిత్రా!

సుచిత్ర : మన వివాహానికి మీ తల్లిదండ్రులు అంగీకరిస్తారా ?

ప్రసాద్ : వారి యాజ్ఞ తీసికుంటాను!

సుచిత్ర : వారు అంగీకరింపకపోతే ?

ప్రసాదు : వారు తప్పకుండ అంగీకరిస్తారు. వారి యనుజ్ఞ యాశీర్వాదాలతోనే మనం కృతార్థుల మవుదాం.

ఇదిగో! ఆ స్నానాల గదిలో స్నానం చేసి, మా అమ్మకోసం కొన్న యీ పట్టుచీరకట్టుకో! తెల్లవారు ఝామున మూడు గంటలకు నల్లగొండకు ఎక్స్‌ప్రెస్ బస్సు వుంది. ఉదయం తొమ్మిది గంటలకల్లా నల్లగొండ చేరుకుందాం! వారి యాశీర్వాదం తీసికుందాం!

సుచిత్ర : సరే! మీ యిష్టం.

(సుచిత్ర పట్టుచీరదీసికొని విశ్రమించును)

(తెరవాలును)

(ప్రథమ రంగము సమాప్తము)

## శోణ పద్మం

### (ద్వితీయ రంగము)

(తెర యెత్తబడును)

(ప్రసాద్ కుర్చీలో కూర్చుని పుస్తకముచదువుకొనుచుండును)
(బయటినుండి తలుపు తట్టిన శబ్దం వినిపించును)

ఇంటి యజమాని గోపాలరావు! ఓ ప్రసాద్! ఓ ప్రసాద్! (లేచి, తలుపు తీసినట్లు నటించి) రండి! గోపాలరావుగారు! రండి! లోపలికి రండి!

(ఇంటి యజమాని గోపాలరావు ప్రవేశించును)

గోపాలరావు : ఏమయ్యా ప్రసాద్! అర్ధరాత్రి మీ యింట్లో చప్పుడవుతోంది! ఎవరో ఆడవాళ్ళు కూడ మాట్లాడు తున్నట్లున్నారు.

ప్రసాద్ : ఏమీ లేదండీ గోపాలరావుగారు! మా మేనమఅదలు ఈ రోజు సాయంత్రం ఇచ్చటికి వచ్చింది. మా అమ్మకు సుస్తీగా వున్నదట! నన్ను వెంట బెట్టుకొని తీసికొని వెళ్ళడానికి వచ్చింది.

గోపాలరావు : ఏదీ మీ మేనమఅదలు ?

ప్రసాద్ : లోపలిగదిలో వుంది. ఇతరుల ముందుకు రావడానికి ఆమెకు తగని సిగ్గు! నా స్నేహితుడు రాము వచ్చినట్లయితే నేను నల్లగొండకు వెళ్ళానని చెప్పండి మా కళాశాల ప్రిన్సిపాల్ గారికి నేను వ్రాసిన లీవు లెటరు మీకిస్తున్నాను! ప్రిన్సిపాల్ గారికి అందజేయమని రాముకివ్వండి.

గోపాలరావు : అల్లాగేనయ్యా! మంచిది. మళ్ళీ యెప్పుడు తిరిగివస్తావు ?

ప్రసాదు : ఒక వారంలో తిరిగి వస్తానండి

(సుచిత్ర ప్రవేశించును)

గోపాలరావు : ఈ అమ్మాయేనా మీ మేనమఅదలు ?

ప్రసాద్ : అవునండీ! ఈమే నా మేనమరదలు. పేరు సుచిత్ర

గోపాలరావు : పేరుకు తగ్గట్టుగానే అందంగా వుంది. ఇంత అందమయిన మేనమరదలును ఇంట్లో పెట్టుకుని ఇంకా పెళ్ళి చేసుకోలే దేమయ్యా ?

ప్రసాద్ : గోపాలరావుగారు! నేను పెళ్ళిచేసుకోవడానికి సిద్ధంగానే వున్నాను. కాని ఆమే నన్ను చేసుకోనం టున్నది. మీరైనా చెప్పండి నన్ను పెళ్ళిచేసుకోమని.

సుచిత్ర : వారు చెప్పేదంతా అబద్ధమండి! నేను చేసుకోవ డానికి సిద్ధంగానే వున్నాను! ట్రయినింగ్ పూర్తి కాసిదే చేసికోనని వారే అంటున్నారు!

గోపాలరావు : మీ యిద్దరికీ ఈడు—జోడు చక్కగా వుంది. రతీమన్మధుల్లా వున్నారు. త్వరగా పెళ్ళిచేసుకోండి! మీ నాన్న నాకు ప్రాణస్నేహితుడు! మీ యిద్దఱికి త్వరగా పెళ్ళి చేసెయ్యమని రేపే వుత్తరము వ్రాస్తాను.

ప్రసాద్ : అట్లాగేనండీ మీ ఆశీర్వచనం త్వరగా నిజం కావాలని వుంది!

గోపాలరావు : (ఆవులించుతూ) నేను వెళ్ళివస్తాను ప్రసాద్, రాత్రి చాల పొద్దుపోయింది. పన్నెండుగంటలు కావ స్తున్నది. నాకు నిద్రముంచుకొస్తున్నది బస్సుస్టాండుకు మీరు రిక్షా మీద వెళ్ళండి. తెల్లవారుజామున మూడు గంటలకు నల్లగొండకు వెళ్ళే ఎక్స్ప్రెస్‌బస్సు వుంది! ఉదయం తొమ్మిది గంటలకల్లా నల్లగొండకు చేరుకుంటారు. ఇంక నేను వెళతానోయ్.

ప్రసాద్ : అట్లాగేనండి! వెళ్ళిరండి.

సుచిత్ర : నమస్కారమండీ బాబాయిగారు!

గోపాలరావు : ఆశీర్వాదమమ్మా! జాగ్రత్తగా వెళ్ళిరండి.

(గోపాలరావు నిష్క్రమించును)

సుచిత్ర : ఇంక పదండి. ఇక్కడే ఒంటిగంట దాటింది!

ప్రసాద్ : (సుచిత్రను పరీక్షించిచూచి) సుచిత్రా! నీవు పట్టు చీర కట్టుకుంటే యెట్లా వున్నావో తెలుసా?

సుచిత్ర : ఎట్లా వున్నాను?

ప్రసాద్ : అచ్చం పెళ్ళికూతురిలా వున్నావు.

సుచిత్ర : ఇన్ని పొగడనవసరంలేదు! మీ చల్లని హృదయంలో నాకు చోటిచ్చారు అంతేచాలు.

ప్రసాద్ : మరి నా చల్లని హృదయంలో నీకు చోటిచ్చాను గదా! మరి నీవు నాకేమిస్తావు?

సుచిత్ర : ఏమివ్వాలో మీరే చెప్పండి.

ప్రసాద్ : నీ తియ్యని స్నేహంలో చోటివ్వమంటున్నాను!

సుచిత్ర : ముందు మీ తల్లిదండ్రుల యనుమతి పొందండి. అంతవరకు నేను మాత్రం ఇవ్వను! ఇంక పదండి.

ప్రసాద్ : ఏదీ! నీ చేయి నా చేతితో కలుపు. అంతవరకు నేను బయలుదేరను.

సుచిత్ర : ఏమిటీ పెంకితనం ?

ప్రసాద్ : అవును పెంకితనమే.

సుచిత్ర : (చేతులుచాచి) ఇవిగో నా చేతులు! మీరే మన్నా చేసుకోండి! మీరు వట్టి పెంకి మనిషిగా కనిపిస్తున్నారు.

ప్రసాద్ : (చేతులు పట్టుకుని) ఆ విధంగా దారికిరా! నా పెంకితనానికి తగినట్లుగా నీవునడచుకుంటూ వుండాలి, తెలిసిందా?

సుచిత్ర : అట్లాగే బాబూ! అట్లాగే ఇంకేం చేయమంటారు చెప్పండి.

ప్రసాద్ : ఈ సంచీ నీవు పట్టుకో! ఈ సూటుకేసు నేను పట్టుకుంటాను. ఇంక నడువు.

సుచిత్ర : అట్లాగే ఇంకనడవండి.

ప్రసాద్ : ఆగు సుచిత్రా! ఆగు,

సుచిత్ర : మళ్ళీ ఏమయింది ?

ప్రసాదు : నీ అలంకరణ అంతా బావుంది కాని...

సుచిత్ర : మఱేమి తక్కువయింది ?

ప్రసాద్ : నీ ముఖచంద్రునిలో మచ్చ లేరు.

సుచిత్ర : మీభాష నా కర్థంకావడంలేదు!

ప్రసాద్ : నీ ముఖముమీద కుంకుమ రేఖ లేదని నా భావం.

సుచిత్ర : ఈ అర్థంరాత్రివేళ కుంకుమ యెక్కడ దొరుకు తుందండీ?

ప్రసాద్ : మొన్న భద్రకాళి ఆలయానికి వెళితే అర్చకులు కుంకుమ పొట్లం ఇచ్చారు. మేజా బల్లమీద ఉండాలి తీసుకువస్తాను వుండు.

సుచిత్ర : అబ్బ మీతో అన్నీ చిక్కులే. మఱి త్వరగా తీసుకురండి. కుంకుమ రేఖ దిద్దుకుంటాను.

(ప్రసాద్ బల్లమీదనున్న కుంకుమపొట్లం తీసికొనివచ్చును)

(సుచిత్ర కుంకుమ గైకొని దిద్దుకొనబోవును)

ప్రసాద్ : ఆగు! సుచిత్రా ఆగు నేను నీకు కుంకుమరేఖ స్వయంగా దిద్దుతాను. రాధకు కృష్ణుడు కుంకుమ దిద్దినట్లుగా!

సుచిత్ర : మీతో అన్నీ చేసిలే. పెళ్ళికాని ఒక స్త్రీకి ఒక పరాయి మగవాడు కుంకుమ రేఖ దిద్దవచ్చునా ?

ప్రసాద్ : నన్ను ఇంకా పరాయివానిగా భావిస్తున్నావా సుచిత్రా ?

సుచిత్ర : లేదు బాబూ లేదు, కట్టుకున్న భర్తగా భావిస్తున్నాను. ఇంక నా నుదుట కుంకుమ రేఖ దిద్దండి
(ప్రసాద్ సుచిత్ర నుదుట కుంకుమ దిద్దును)

ప్రసాద్ : ఇప్పుడెంత అందంగా వున్నావో అద్దంలో చూడు సుచిత్రా!

సుచిత్ర: అద్దం కూడ మీరే చూపండి!

ప్రసాద్ : అట్లాగే సుచిత్రా! (బల్లమీద వున్న అద్దం చూపును)

సుచిత్ర : అయితే మరింక నా కన్నులకు కాటుకను దిద్దండి! కురులను సరిచేసి పూవులు తురుమండి! కాళ్ళకు లత్తుక నలంకరించండి.

ప్రసాద్ : మన పెళ్ళయాక ప్రతిరోజు నీ కలాగే అలంకరిస్తాను సుచిత్రా!

సుచిత్ర : ఇంక చాలు మీ చిలిపి మాటలు! చిలిపి చేష్టలు! ఆ కాజీలు వచ్చారంటే ఇక్కడే మన పెళ్ళవుతుంది!

ప్రసాద్ : మనలను ఎవ్వరూ ఏమీ చేయలేరు, లోకజనని భద్రకాళి మన వెంటవుండి కంటికి రెప్పలా కాపాడుతుంది.

సుచిత్ర : అవును! ఆ పరమేశ్వరే మనకు శరణ్యం!
ప్రసాద్ : ఇంక పద! వీధిలో రిక్షాబండి మాట్లాడి బస్సు స్టాండుకు చేరుకుందాం.
సుచిత్ర : అట్లాగే పదండి!

(ఇరువురు నిష్క్రమింతురు)

(తెర వాలును)

(ద్వితీయ రంగము సమాప్తము)

# శోణపద్మం

## (తృతీయ రంగము)

(అయోధ్యరామయ్యగారు కుర్చీలో కూర్చుని పేపరు చదువుకొనుచుండును.)

(తెర యెత్తబడును)

అయోధ్యరామయ్య : రాజ్యం! ఓ రాజ్యం! ఎనిమిదిగంటలు కావస్తున్నది. కాస్త కాఫీ అన్నా యిస్తావా లేదా?
రాజ్యలక్ష్మమ్మ : (లోపలనుండి) తీసుకువస్తున్నా ఉండండి!

(రాజ్యలక్ష్మమ్మ కాఫీతో ప్రవేశించి భర్తకిచ్చును)

అయోధ్య : ఇప్పటికి యెనిమిది గంటలయింది. కాఫీ ఇచ్చావు. ఇంక భోజనం యెన్ని గంటలకు తయారవు తుందో యేమో! ఒక వంటమనిషిని పెట్టుకోమంటే

ఒప్పుకోవు! స్వయంగా నువ్వే వండాలి! మనమే తినాలి! ఎప్పుడూ పూజలు, స్నానాలు, మడులు, ఆచారాలు! మనమేమన్నా బ్రాహ్మలమా? వైష్ణవులమా?

రాజ్యం: బ్రాహ్మలము వైష్ణవులము కాకపోతేనేమి? ఈ ఇంటిలో సనాతనంగా వస్తూన్న ఆచారాలు, సంప్రదాయాలు నేను వదులుకోలేను! ఏమో! ఈ పూట నా మనస్సేమీ బాగుండలేదు. రాత్రినుండి మన శైలజ నా కళ్లల్లో మెదులుతూ ఉంది. పాలబుగ్గల శైలజ పసిపాపల్లే పిల్లగా మారినట్లు, నా హృదయానికి ఆ పిల్లను హత్తుకున్నట్లు తెల్లవారుజామున కల వచ్చింది! తెల్లవారుజామున వచ్చిన కలలు నిజమవుతాయని చెబుతుంటారు! నా కల నిజమైతే ఎంత అదృష్టవంతురాలను!

అయోధ్య: రాజ్యం! లేనిపోని భ్రమలు పడకు!

రాజ్యం: నా భ్రమలు నావి! శైలజను గురించి ఈ వారం ఆంధ్రపత్రికలో ప్రకటించారా?

అయోధ్య: అదిగో చదివావా పేపరు! చూడు! నా మాట మీద నమ్మకం లేకపోతే! ఇప్పటికి పది సంవత్సరాల నుండి ఆంధ్రపత్రికలో పదంగుళాల స్థలంలో, ప్రతి ఆదివారం శైలజ చిన్ననాటి ఫోటోతో సహా ప్రకటిస్తున్నాం! కాని ఫలితం ఏదీ? శైలజ జాడలు తెలిపినవారికి బహుమానం కూడ ఇస్తామని ప్రకటించాం. దురదృష్టం! ఆ పిల్ల ఏమయిందో ఏమో!

రాజ్యం : మంచివారి కెవరికయినా దొరికి వున్నట్లయితే తప్పకుండ మనమ్మాయిని మనకప్పజెప్పి వుండేవారు. ఎవరో దుష్టుల చేతిలో పడివుంటుంది. బిడ్డ యెక్కడ యెన్ని కష్టాలు పడుతున్నదో యేమో!

అయోధ్య : అందుకే నేను చెబుతున్నది విను! ఇంక శైలజ మీద ఆశ వదులుకో రాజ్యం! ఆ పిల్ల మనకింక దొరకదు!

రాజ్యం : ఏమిటీ?

అయోధ్య : శైలజ మనకింక దొరకదు! నేను శైలజనుచూచి చిన్నతనంలోనే చెప్పలేదా రాజ్యం! శైలజ దేవ బాల యనీ ఆ పిల్ల మనకు దక్కదనీ!

రాజ్యం : అయితే యిప్పుడేం చేయమంటారు?

అయోధ్య : మన ప్రసాదుకు ఎన్నో పెళ్ళి సంబంధాలు వస్తున్నాయి. శైలజ దొరుకుతుందనీ, దానిని కోడలుగా జేసుకుందామనీ వచ్చిన సంబంధాలనన్నీ కాదన్నావు! ఇప్పటికయినా ఒక అమ్మాయిని నిర్ణయించి అబ్బాయికి పెళ్ళి చేద్దాము! శైలజే దొరకాలి, దాన్నే అబ్బాయికిచ్చి పెళ్ళి చేయాలనుకుంటే ఈ జన్మలో అది కుదరదు.

రాజ్యం : ఆగండి! ఆ మాటనకండి! శైలజ తప్పకుండ దొరుకుతుంది. మా అన్నయ్య చనిపోయే ముందు అతనితో నేను ప్రతిజ్ఞ చేశాను. తల్లి లేని ఈ పిల్లను నేను పెంచి పెద్దచేసుకుంటాననీ, కోడలుగా చేసుకుంటాననీ, వాగ్దానం చేశాను. ఇంతకు నేను దుర

దృష్టవంతురాలను. నా వలననే శైలజకు ఈ యవస్థ పట్టింది. ఆ హైదరాబాదు వస్తుప్రదర్శన శాలకు మనమా పిల్లను తీసికొని వెళ్ళిపోతే ఈ దుస్సం ఘటన జరిగివుండేది కాదేమో!

అయోధ్య : ఆ మాట నిజమే! లక్షలాది ప్రజలున్న ఆ ఎగ్జిబిషనులో మన శైలజ తప్పిపోయింది. ఇంతకు అల్లా జరుగవలసి వుండి. జరిగింది!

రాజ్యం : ఇంతకు మన శైలజ ఏమయినట్లు? ఆ రోజే మనం హైదరాబాదు నగరమంతా గాలించాము. అన్ని పోలీసు స్టేషనులకు తెలియజేశాము. ఫలితం లేక పోయింది!

అయోధ్య : ఎవరో పిల్లలు లేనివారికి దొరికి వుంటుంది. లేదా దొంగలెవరయినా యెత్తుకొని వెళ్ళి వుంటారు. ఏమి చేద్దాం? మనం చేయవలసిన కృషి అంతా చేశాము. ఇంతకు ఆ పిల్ల దురదృష్ట వంతురాలు!

రాజ్యం : అవును! దురదృష్టవంతురాలే! మూడేళ్ళ పసి తనంలో తల్లి చనిపోవడం—తల్లిపోయి సంవత్సరం తిరు గకముందే—భార్యావియోగంతో తండ్రి చనిపోవడం. మళ్ళీ సంవత్సరమైనా తిరుగకముందే- మన దగ్గర నుండి ఆ పిల్ల తప్పిపోవడం-ఇదంతా దురదృష్టం కాక మరేమిటి?

అయోధ్య : ఒక్కొక్కప్పుడు జీవికి—దురదృష్టం తరువాత దురదృష్టం వెన్నాడుతుంటుంది. ఒక్కొక్కప్పుడు అదృష్టం తరువాత అదృష్టం కూడ యెదురవుతుం

టుంది. ఇదంతా దైవ చిత్రం! మన చేతిలో ఏమీ లేదు కదా!

రాజ్యం : ఆ మాట నిజమే అనుకోండి! ఆ భగవంతుడు కూడ మంచి వారికే కష్టాలు తెచ్చి పెడుతువుంటాడు. నమ్మిన వారికే దుఃఖాలు కలిగిస్తాడు. శైలజ నాలు గేళ్ళ ప్రాయంలోనే నాతో బాటు పీట మీద కూర్చొని గౌరీ పూజ చేస్తూ వుండేది!

అయోధ్య : అవును! మన పురోహితులు శ్రీరామకృష్ణయ్య పంతులుగారు నేర్పిన పాటను— పూజా సమయంలో వచ్చీరాని పలుకులతో పలుకుతూ వుండేది. ఆ పాట నీకు జ్ఞాపకం వుందా రాజ్యం?

రాజ్యం : అవును! ఆ పాట నాకిప్పటికి జ్ఞాపకం వుంది! పాడ మంటారా?

అయోధ్య : ఏదీ పాడు!

రాజ్యం : ఆరవిచ్చిన తమ్మి యకరు పుష్పాళ్ళ
గౌర వర్ణము మేని గల దేవి గౌరి!
మము గన్న తల్లి యుష్మత్ప్రసాదమున
సమకూరు గాక! నా సమభివాంఛితము!

ఈ పాట ఎవరో గొప్ప కవిగారు రచించారనీ, ఈ పాట పాడి గౌరి దేవిని వేడుకుంటే, మంచి భర్త కలుగుతాడనీ, మన పురోహితుల వారు చెప్పి శైల జతో పాడించేవారు. శైలజ వచ్చీరాని పలుకులతో ఆ పాటను పాడుతు వుండేది. (దుఃఖించును)

అయోధ్య : రాజ్యం! నీవు అనవసరంగా బాధపడకు! నన్ను బాధపెట్టకు! శైలజను జ్ఞాపకము చేసి మగవాడినయిన నాకు కూడ కన్నీళ్ళను తెప్పిస్తున్నావు. శైలజ చని పోయిందనుకో! రాజ్యం! శైలజ చనిపోయిందనుకో! (కన్నీరు తుడుచుకొనును).

రాజ్యలక్ష్మి : (ఆవేశముతో) ఆ మాట అనవద్దండీ! ఆ మాట మళ్ళీ అనవద్దండీ! మన శైలజ బ్రతికేవుంది! మన శైలజ జీవించేవుంది! తప్పకుండ దొరుకుతుంది! రేపో మాపో మన యింటికి వస్తుంది. మనకు కోడలవు తుంది. ఈ యింటికి దీప మవుతుంది. గృహలక్ష్మి అవుతుంది. లోకజనని గౌరీదేవి పూజ వ్యర్థంకాదు; గౌరీ మాత తప్పక కరుణిస్తుంది. కోరిక నెరవేరుస్తుంది. మన కోరిక సఫలం చేస్తుంది! నిజమండీ! నా మాట నమ్మండీ!

(రాజ్యలక్ష్మి దుఃఖావేశముతో క్రిందపడి పోవుచుండును)

అయోధ్య : (రాజ్యలక్ష్మిని పట్టుకొని) రాజ్యం! ఎందుకీ ఆవేశం? శైలజ చనిపోలేదులే! బ్రతికేవుంది! తప్ప కుండా వస్తుందిలే! మనకు కోడలవుతుందిలే! ఈ యింటికి దీప మవుతుందిలే! దుఃఖింపకు! దుఃఖింపకు!

రాజ్యం : నిజంగా శైలజ మన యింటికి వస్తుందంటారా?

అయోధ్య : తప్పకుండ వస్తుంది. గౌరీమాత మనలను అన్యా యం చేయదు.

రాజ్యం : నిజంగా నేనా?

అయోధ్య : నిజంగానే! నా మాట నమ్ము! త్వరగా వంట కానివ్వు! నేను భోజనం చేసి బయటికి వెళ్ళవలసిన పనివుంది.

రాజ్యం : అలాగే ! (రాజ్యం లోపలకు నిష్క్రమించును)

అయోధ్య : (తనలో) తహసీలుదారుగా నేను ఉద్యోగం చేసి యెన్నో చిక్కు సమస్యలను పరిష్కరించాను. కాని నా యింటి సమస్యలను నేను పరిష్కరింప లేక పోతున్నాను. (పైకి చూచి) అమ్మా! శైలజా నీ వెక్కడున్నావో గాని యీ యింటి కెన్ని తిప్పలు తెచ్చి పెట్టావమ్మా!

(బయటికి నిష్క్రమించును)

(తెరవాలును)

తృతీయ రంగము సమాప్తము

# శోణ పద్మం

## (చతుర్థ రంగము)

(అయోధ్య రామయ్యగారు కుర్చీలో కూర్చుని పేపరు చదువుకొనుచుండును.)

(తెర యెత్తబడును.)

(వెలుపలి నుండి మనోహర్ సుచిత్రలు ప్రవేశింతురు. సుచిత్ర స్తంభము చాటున నిలబడును. మనోహర్ సూట్ కేస్‌తో ప్రవేశించును.)

ప్రసాద్ : (మనోహర్ సూట్ కేసుతో ప్రవేశించి) నమస్కారం నాన్నగారు!

అయోధ్య : ఏరా ప్రసాద్! పరీక్షలయిందాకా యింటికి రానని ఉత్తరం వ్రాసి, చెప్పా చెయ్యకుండా మధ్యలో వచ్చావు?

ప్రసాద్ : అలా రావలసివచ్చింది నాన్నా!

అయోధ్య : నీతో కూడ వచ్చి ఆ స్తంభము చాటుననున్న ఆ అమ్మాయి ఎవరురా?

ప్రసాద్ : (సుచిత్రతో)సుచిత్రా! ఇలారా! వీరు మా నాన్నగారు! నమస్కరించు!

(సుచిత్ర ప్రవేశించి—అయోధ్య రామయ్యగారికి పాదాభివందనం చేయును.)

అయోధ్య : నీ మనస్సులోని కోరిక నెరవేరాలని ఆశీర్వాదిస్తున్నాను. తల్లీ! (ప్రసాద్‌తో) ఎవరురా ఈ అమ్మాయి! నీతో బి.యిడి. పూర్తిచేస్తున్న సహాధ్యాయినియా?

ప్రసాద్ : కాదు నాన్నా! ఒక అనాథ!

అయోధ్య : అనాథ? ఏమిటిరా నీ మాటలు? అమ్మాయి సుక్షేమంగా వుందే!

ప్రసాద్ : అవును నాన్నా! ఈ అమ్మాయి ఒక అనాథ ఈ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని మాటయిచ్చాను. మీ ఆశీర్వాదం కోసం తీసికొని వచ్చాను నాన్నా!

అయోధ్య : ఏమిటీ ఈ అమ్మాయిని పెళ్ళి చేసి కుంటానని మాట ఇచ్చావా? మాట ఇచ్చావుగా! ఇంక పెళ్ళి చేసుకో! మా ఆశీర్వాదముతో నీకు పనేమిటి?

ప్రసాద్: క్షమించు నాన్నా! ఈ అమ్మాయి...

అయోధ్య' ఒరేయ్ ప్రసాద్! నీకు జ్ఞానం పూర్తిగా నశించింది. ఆ అమ్మాయి కులం— గోత్రం. ఊరు-పేరు తల్లిదండ్రీ పేర్లను చెప్పకుండ ఆశీర్వదింపమనడం విచిత్రంగా వుంది. (సుచిత్రతో) ఎవరమ్మా నీవు నీ తల్లిదండ్రుల పేర్లేమిటి?

సుచిత్ర : నాకు ...తల్లి ...దండ్రి...

ప్రసాద్ : నాన్నా! ఈమెకు తండ్రి లేడు. తల్లి పడుపు వృత్తితో జీవించే ఒక వేశ్య!

అయోధ్య : ఏమిటీ? తండ్రి లేడా?

ప్రసాద్ : లేడు!

అయోధ్య : తల్లి పడుపు వృత్తితో జీవించే ఒక వేశ్యా?

ప్రసాద్ : అవును!

అయోధ్య : మఱి ఇటువంటి అమ్మాయినేనా నీవు వివాహం చేసుకునేది?

ప్రసాద్ : ఈ అమ్మాయి ఆ వృత్తిలోనికి దిగలేదు నాన్నా!
ఈ అమ్మాయికి ఆ వృత్తి ఇష్టంలేదు.

అయోధ్య : ఇష్టంలేదని నీకెలా తెలుసు? ఈమెతో నీ కెన్నాళ్ళ నుండి పరిచయం?

ప్రసాద్ : ఈ అమ్మాయితో గతంలో నాకెప్పుడు పరిచయం లేదు నాన్నా! గత రాత్రినుండే ఈమెతో పరిచయం.

అయోధ్య : అంటే పన్నెండు గంటల పరిచయమన్నమాట!

ప్రసాద్ : అవును నాన్నా! పన్నెండు గంటల పరిచయం. ఈమె గృహిణిగా జీవితం గడపాలనుకుంటున్నది. తల్లి పెట్టే బాధలు భరించలేక అర్ధరాత్రి పారిపోయి వచ్చి నన్ను ఆశ్రయించింది. ఈమెను దుండగుల బారి నుండి కాపాడాను. వివాహం చేసుకుంటానని మాట ఇచ్చాను.

అయోధ్య : గొప్ప సంఘ సంస్కర్తవు బయలుదేరావు.

ప్రసాద్ : అదేమి కాదు నాన్నా! ఈమె దీనత్వాన్ని చూచాక నా హృదయం ద్రవించింది! అంతే!

అయోధ్య : గొప్ప దయార్ద్ర హృదయుడవు బయలుదేరావు. సరేగాని ముందు నేనడిగే ప్రశ్నలకు సరియైన సమాధానాలివ్వు.

ప్రసాద్ : ఏమిటి నాన్నా మీ ప్రశ్నలు?

అయోధ్య : మన కుటుంబానికి సంఘంలో ఎటువంటి స్థానం ఉంది?

ప్రసాద్ : సంఘంలో మంచి పేరు ప్రతిష్టలున్న కుటుంబం నాన్నా మనది!

అయోధ్య : నేనే ఉద్యోగం చేసి మన్నన లందాను?

ప్రసాద్ : తహశీల్‌దారు ఉద్యోగం చేసి నాన్నా!

అయోధ్య : నీవు ఒక వేశ్య కుమార్తెను పెళ్ళి చేసుకున్నట్లయితే మన కుటుంబానికి యెటువంటి ప్రతిష్ఠ వస్తుందో తెలుసా?

ప్రసాద్ : ప్రతిష్ఠ కాదు; అప్రతిష్ఠ వస్తుంది నాన్నా!

అయోధ్య : మన కులం మనలను ఏం చేస్తుంది?

ప్రసాద్ : వెలి వేస్తుంది!

అయోధ్య : సంఘం యేం చేస్తుంది?

ప్రసాద్ : నీచంగా చూస్తుంది.

అయోధ్య : మన కుటుంబ సభ్యులు సంఘంలో తల యెత్తుకు తిరుగ గలరా?

ప్రసాద్ : తిరుగలేరు నాన్నా!

అయోధ్య : మరి అన్నీ తెలిసి యీ విధంగా యెందుకు గోతిలో బడుతున్నావు?

ప్రసాద్ : ఒక అనాథను కాపాడడానికి నాన్నా!

అయోధ్య : ఒక అనాధను కాపాడదలుచుకున్నావు! బాగానే వుంది. నీవు చేయదలుచుకున్న చర్యవలన మన కుటుంబము, మన భవిష్యత్తు ఏమవుతుందో ఆలోచించావా?

ప్రసాద్ : మీాకు కనిపించకుండ — బహుదూరం — బహు దూరప్రాంతానికి పోయి జీవిస్తాం నాన్నా! మీాకు ఈవిధంగా బాధ కలిగించినందులకు క్షమించండి నాన్నా!

అయోధ్య : నీవు దూర ప్రాంతానికి వెళితేమాత్రం మాకు ఆ కళంకం పోతుందా? నీవు ఒక్కడవే మా కాధారము. నీవు వెళ్ళిపోతే మాకు దిక్కెవ్వరు? ఈ యిల్లు వాకిలి — ధనము — సంపద యేం చేయ్యాలి?

ప్రసాద్ : చెల్లాయి కివ్వండి నాన్నా! చెల్లాయినే కుమారునిగా భావించుకోండి నాన్నా!

అయోధ్య : అంటే ఆ అమ్మాయికోసం — తల్లి దండ్రులను — ఇల్లు-వాకిలీ అన్నీ వదిలి పెట్టి వెళ్ళిపోతావన్న మాట! కని పెంచిన తల్లి దండ్రులకంటె పన్నెండు గంటల పరిచయమున్న యీ అమ్మాయి యెక్కువన్న మాట!

ప్రసాద్ : మీరు నాకు దైవ సమానులు నాన్నా! కానీ ఆ అమ్మాయి అనాథ!

అయోధ్య : అనాధ కాదురా! మోసగత్తె! నీమీద మత్తు మందు చల్లి నిన్ను వశపఱచుకుంది! నేను యిప్పుడే పోలీసు స్టేషనుకు రిపోర్టు చేస్తాను! [ఫోను దగ్గఱకు పోవును]

ప్రసాద్ : వద్దు నాన్నా వద్దు! పోలీసులకు ఫోను చేయకండి నాన్నా!

అయోధ్య : ఒరే ప్రసాద్! నీకు తెలియదు ఊరుకో! [ఫోను తీసికొని] హాలో! ఫోను నెంబరు......పోలీసు స్టేషను........హాలో! పోలీసు ఇన్‌స్పెక్టరుగారు! నమస్కారం! మాట్లాడుతున్నది రిటైర్డుతహశీల్‌దార్ అయోధ్య రామయ్యను! దయచేసి రామగిరిలో ఉన్న మా యింటికి ఒకసారి దయచెయ్యండి!......ఏమిటీ?

అర్జంటు పనిమీద ఉన్నారా?...ఒక అర్థగంట తరువాత వస్తారా? మంచిది! అట్లాగే రండి! నమస్కారం.

ప్రసాద్ : మీరు చేసింది యేమీ బాగాలేదు నాన్నా! ఈ అమ్మాయి మోసగత్తె కాదు నాన్నా! గృహిణిగా జీవితం గడపాలనుకుంటున్నది నాన్నా!

అయోధ్య : ఒక వేశ్యకుపుట్టి, - ఒక వేశ్యయింటిలో పెరిగిన ఒక స్త్రీ గృహిణిగా జీవిస్తుందంటే నేను నమ్మను.

ప్రసాద్ : నేను పెళ్ళి చేసికుంటానని మాట యిచ్చాను నాన్నా!

అయోధ్య : ఒరేయ్! ప్రసాద్! నీకు పిచ్చి యెత్తింది! నీవు ఇంట్లోకివెళ్ళి విశ్రాంతితీసుకో! వెళ్ళు! [సుచిత్రతో] ఇదిగో అమ్మాయ్! నీవు పెళ్ళి చేసుకోవాలనుకుంటే లోకంలో కావలసినంతమంది దొరుకుతారు! ఆడిన యీ నాటకం చాలును! ఇంక వెళ్ళు! ఇంక — మాకు, మా అబ్బాయికి — కనిపించకు!

సుచిత్ర: ఇప్పటివరకు మీరు నన్ను ఎన్నో మాటలన్నారు! అన్నీ సహించాను! అయితే — మీరన్న మాటలన్నీ నిజమే! నేను ఒక వేశ్యకు జన్మించాను. సమాజంలో నా కెటువంటి స్థానము లేదు! సంఘంలో నే నెప్పుడు తలయెత్తుకొని తిరుగలేను. నా నీడ సోకిన ప్రతివారు మలినమవుతారనికూడ తెలుసు! ఈ విషయాలన్నీ మీ అబ్బాయిగారికి ముందే చెప్పాను.

అయోధ్య : ముందే చెప్పావా?

సుచిత్ర : ముందే చెప్పాను! నామాట వింటేనా? నన్ను స్వీకరిస్తే - కులంనుండి బహిష్కరింప బడతారనీ,

సంఘంనుండి మంచిపుత్రుడనీ — అంతేకాదు మనకు పుట్టబోయే సంతానాన్నికూడ సమాజం వేలెత్తి చూపుతుందనికూడ చెప్పాను!

అయోధ్య : ఏరా ప్రసాద్! ఇదంతా నిజమేనా?

ప్రసాద్ : నిజమే నాన్నా!

అయోధ్య : వారికి నీవేమన్నావు?

ప్రసాద్ : అన్నీ సహిస్తానని, నా తల్లిదండ్రుల అనుమతి తీసికొని వివాహం చేసుకుంటానని చెప్పాను నాన్నా! చేతిలో చెయ్యివేసి బాస చేశాను నాన్నా! ఆమె రెండు చేతులు తీసికొని పాణిగ్రహణం చేశాను నాన్నా! అమ్మకోసం కొన్న పట్టుచీర ఆమెచేత కట్టించి నుదుట సిందూరరేఖ దిద్దాను నాన్నా! అంతేకాదు, ఆమె కళ్ళల్లో నేను, — నా కళ్ళల్లో ఆమె నీడలు చూసుకొని కలిసిపోయాం నాన్నా! మీరు అంగీకరిస్తారనే ఆశతో యీ విధంగా చేశాను నాన్నా! ఈ అమ్మాయితో నాకు వివాహం కాకపోతే నా జీవితం విషాదగీతం అవుతుంది నాన్నా! ఎడారి పయనం అవుతుంది నాన్నా!

అయోధ్య : ఒరేయ్ ప్రసాద్! నోరుముయ్! నీవేమి మాట్లాడుతున్నావో ఎవరితో మాట్లాడుతున్నావో నీకు తెలియడం లేదు.

ప్రసాద్ : నాన్నా!

అయోధ్య : ఈ అమ్మాయితో నీకు వివాహం జరిగితే మా జీవితం విషాదగీతం కాదట్రా? ఒరేయ్! ప్రసాద్!

నీకు ప్రేమ పిచ్చి పట్టింది! ముందు నీవు యింట్లోకి వెళ్ళు! (సుచిత్రతో) ఇదిగో అమ్మాయి! ఇచ్చటినుండి వెంటనే వెళ్ళిపో! లేకపోతే పోలీసు స్టేషనుకు వెళ్ళ వలసి వస్తుంది!

సుచిత్ర : నే నిప్పుడే వెళ్ళిపోతున్నాను! మీ గృహ జీవితంలో ఈవిధంగా తుఫాను రేపినందుకు నన్ను క్షమించండి! నమస్కారం! [వెడలిపోవుటకు యత్నించును.]

ప్రసాద్ : సుచిత్రా! వెళ్ళకు! వెళ్ళకు! [సుచిత్ర వెళ్ళిపోకుండ చేయి పట్టుకొనును!

సుచిత్ర : ప్రసాద్ గారు! నన్ను వివాహం చేసికొని మీ రే విధంగాను సుఖాన్ని పొందలేరు! మీలాంటి వారి కులీన కుటుంబంలో నాకు స్థానంలేదు! నా చేయి వదలండి! నన్నిచ్చటినుండి వెళ్ళనివ్వండి!

అయోధ్య : [ప్రసాద్ రెండవ చేయి పట్టుకొని లాగుతూ] ప్రసాద్! ఆ అమ్మాయి చేయి వదిలిపెట్టు! లోపలికి రా!

ప్రసాద్ : (ఒకచేతితో సుచిత్ర చేయి పట్టుకొని - తండ్రితో ఈ అమ్మాయి యెచ్చటికి వెళుతుంది నాన్నా?

అయోధ్య : సంఘంలో [illegible] అభాగ్యులు అనేకు లున్నారు! వారంతా యెక్కడున్నారో అచ్చటికి వెళుతుంది! ఆ అమ్మాయి చేయివదలు! ఎవరన్నా చూస్తే నవ్వుతారు! లోపలికి రా! (రెండు చేతులతో ప్రసాద్ చేయి పట్టుకొని లాగుచుండును)

ప్రసాద్ : అమ్మా! అమ్మా!

(రాజ్యం భర్తతో లోపలినుండి ప్రవేశించును)

రాజ్యం : (భర్తతో) ఏమిటండీ యీగోల? (ప్రసాద్‌తో) ప్రసాద్! ఎప్పుడొచ్చావురా బాబూ! ఆ అమ్మాయి ఎవరు? (భర్తతో) ఏమండీ! మన ప్రసాద్ చేతిని రెండు చేతులతో ఎందుకలా లాగుతున్నారు? (ప్రసాద్‌తో) ఒరే ప్రసాద్! ఎవరా అమ్మాయి? ఆ అమ్మాయి చేతి నలా ఎందుకని పట్టుకు లాగుతున్నావు? ఏమిటీ గోలంతా? ఎవరూ చెప్పరేం?

(అందరూ చేతులు వదిలిపెట్టుదురు)

అయోధ్య : చూడు! నీ కుమారుడు చేసిన ఘనకార్యం! ఈ అమ్మాయి ఒక వేశ్యకుమార్తె! ఈ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని మాటయిచ్చి, మన ఆశీర్వాదం కోసం తీసికొని వచ్చాడు!

రాజ్య : ఛీ! ఛీ! ఏమంటున్నారండీ యీ అమ్మాయి వేశ్యకుమార్తెనా? పట్టుచీర కట్టుకొని పార్వతీదేవిలాగుంటే!

అయోధ్య: నా మాటమీద నమ్మకం లేకపోతే ప్రసాదునడుగు!

రాజ్య : ఏరా ప్రసాద్! నిజమేనా?

ప్రసాద్ : నిజమేనమ్మా! నాన్నగారు చెబుతున్నది నిజమే!

రాజ్య ; (భర్తతో నెమ్మదిగా) చూడండి! ఈఅమ్మాయిలో నాకు మన శైలజ పోలికలు కనిపిస్తున్నవి. సరిగా పరికించి చూడండి!

అయోధ్య (భార్యతో నెమ్మదిగా) నాకు అలానేఅనిపిస్తున్నది! (సుచిత్రతో) అమ్మాయి! నీ పేరేమిటి?

సుచిత్ర : నా పేరు సుచిత్ర!

రాజ్య ; (భర్తతో నెమ్మదిగా) పేరుకేముంది? మన శైలజ దొరికినవాళ్ళు ఈ పేరు పెట్టుకొని వుంటారు. ఎందుకనో నాకు ఈ అమ్మాయిమీద చెప్పలేనంత ప్రేమ హృదయంనుండి పొంగి పొరలి వస్తున్నది. చిన్ననాటి శైలజనువలె అక్కున జేర్చుకోవాలని పిస్తున్నది! (సుచిత్రతో) అమ్మాయి! నిజంగా నీకు తండ్రి లేడా? నిన్నెవరు పెంచిపెద్ద చేశారు?

సుచిత్ర : తండ్రి లేడండీ! మా అమ్మే నన్ను పెంచి పెద్ద చేసింది!

రాజ్య : (భర్తతో నెమ్మదిగా) చూడండీ! ఆ బుగ్గమీద పుట్టుమచ్చ మన శైలజకు వున్నట్లుగ లేదు?

అయోధ్య : (నెమ్మదిగా) అవును రాజ్యం! ఇంతవఱకు నేను ఆపుట్టుమచ్చను గమనించ లేదు. అచ్చం మన శైలజకు వున్నట్లుగా వుంది! (సుచిత్రతో) అమ్మాయి! నిన్ను మీ అమ్మ పెంచిందని చెప్పావు. ఆమె కన్నతల్లా? పెంచిన తల్లా?

సుచిత్ర : కన్నతల్లే అనుకుంటున్నాను! కాని యెవరో ఆమె పెంచినతల్లి యని చెప్పారు!

రాజ్య : ఈ పాట నీవెప్పుడైనా విన్నావా తల్లీ!

సుచిత్ర ఏ పాట?

రాజ్య : ఆటవిచ్చిన తమ్మి యారు పుష్పాళ్ళ
గౌర వర్ణము మేని గల దేవి గారి!
మముగన్న తల్లి! యుష్మత్ప్రసాదమున
సమకూరుగాక! నా సమభివాంఛితము!

ఈ పాట నీ వెప్పుడైనా విన్నావేమో జ్ఞాపకం తెచ్చుకో తల్లీ!

సుచిత్ర: ఎప్పుడో - ఎక్కడో - ఎన్నాళ్ళ క్రిందటో విన్నట్లనిపిస్తున్నది. సరిగా జ్ఞాపకం రావటము లేదు.

రాజ్య: [భర్తతో నెమ్మదిగా] ఈ అమ్మాయి నిజంగా శైలజే అనిపిస్తున్నది. సందేహం లేదు!

అయోధ్య: [భార్యతో నెమ్మదిగా] నాకుకూడ అట్లాగే అనిపిస్తున్నది! రాజ్యం! నాకు జ్ఞాపకం వచ్చింది! శైలజకు కుడిభుజంమీద కాలిన మచ్చ వుండాలి! చిన్నప్పుడు పూజామందిరంలో దీపమాలికా స్తంభం మీదపడి కాల్చుకుంది. ఆ కాలినమచ్చ యీ అమ్మాయి కుడిభుజంమీద వున్నట్లయితే యీ అమ్మాయి తప్పకుండ శైలజే!

రాజ్య: [భర్తతో నెమ్మదిగా] కుడిభుజం మీదవున్న ఆ మచ్చ యెట్లా కనబడుతుందండీ? ఆ మచ్చ వున్నదో లేదో తెలుసుకోవడానికి యత్నిస్తాను. [సుచిత్రతో] ఇటు రా అమ్మా! నిన్నుజూస్తే మా శైలజ జ్ఞాపకానికొస్తున్నది. ఏదీ, నన్నొక్కసారి కౌగలించుకోనీ తల్లీ! [సుచిత్రను కౌగలించుకొని కాలిన మచ్చను గమనించును. శైలజా! యని మఱల కౌగలించుకొనును]

సుచిత్ర: శైలజ యెవరండీ?

రాజ్య: శైలజ మా అన్నయ్య కుమార్తె. ఆపిల్ల చిన్నతనంలో తప్పిపోయింది.

సుచిత్ర : [తనలో — దేవీకటాక్షం వలన ఆ పిల్లను నేనవ్వ గూడదూ?] (రాజ్యలక్ష్మమ్మతో) ఇంక నేను వెళతాను! సెలవిప్పించండి!

రాజ్య: ఎక్కడికి వెళతావు? అవునుగాని అమ్మాయి! నీ కుడి భుజం మీద యీ మచ్చ యేమిటి?

సుచిత్ర : కాలిన మచ్చ అని మా అమ్మ చెప్పింది.

[రాజ్యలక్ష్మమ్మ శైలజా! అంటూ మరల సుచిత్రను కౌగలించుకొనును]

రాజ్య : ఈ అమ్మాయి మన శైలజేనండి! కాలిన మచ్చ కుడిభుజం మీదవుంది. నా మొఱ నాలించి జగన్మాత గౌరీదేవే శైలజను నా దగ్గఱకు పంపించింది.

అయోధ్య : ఇదంతా జగన్మాత కరుణే! విచిత్రం!

[పరిమళం, రంగడు వెలుపలినుండి హఠాత్తుగా ప్రవేశింతురు.]

రౌడీ రంగడు : అక్కా! దొరికారే దొంగలు! ఇదిగో! మన చిన్నారి యిక్కడ కులుకుతోంది! (ప్రసాద్‌తో) ఏమయ్యా! పెద్దమనిషీ! ఏమీ యెఱుగనట్లు చూస్తున్నావు? రాత్రి యీపిల్లను గదిలో దాచిపెట్టి, తెల్లవారేకల్లా నల్లగొండకు తీసుకొచ్చావు! నిన్నేమనాలి?

సుచిత్ర : నన్ను కాపాడండి! నన్ను రక్షించండి!

అయోధ్య : నీకేం భయం లేదు శైలజా! నిర్భయంగావుండు! (వచ్చినవారితో) ఎవరు మీరు?

రంగడు : మేమెవరైయుంటే మీకెందుకు? ఈమె పేరు పరిమళం! నా పేరు రంగడు!

అయోధ్య : ఈ అమ్మాయికీ - మీకు వున్న సంబంధం?

రంగడు : ఈ అమ్మాయి మా అక్క పరిమళానికి కుమార్తె. నాకు మేనమఱదలు!

అయోధ్య : ఈ అమ్మాయి పరిమళానికి కుమార్తెగాదు, నీకు మేనమఱదలు కాదు, నిజం చెప్పండి!

పరిమళం : ఈ అమ్మాయిని కనిపెంచిన తల్లిని బాబూ! రాత్రి యింట్లోనుండి పారిపోయి వచ్చింది! మా అమ్మాయిని మాతో పంపించండి! మీ కాళ్ళకు మొక్కుతా!

అయోధ్య : ఈ అమ్మాయి మా అమ్మాయి! నీ కూతురు కాదు, నిజం చెప్పు! ఈ అమ్మాయి నీ కెలా దొరికిందో? లేకపోతే పోలీసుస్టేషను కెళతావు!

పరిమళం : మా అమ్మాయే బాబూ.

అయోధ్య : మీ ఆటలు నా దగ్గిర సాగవు! నిజం చెప్పు! లేకపోతే కఠిన శిక్షలు అనుభవిస్తావు! జాగ్రత్త!

పరిమళం : (భయంతో) క్షమించండి బాబూ! నాలుగేళ్ళ వయసులోవున్న యీ పిల్లను మా రంగడు యెక్కడి నుండో తెచ్చి నాకు ఇచ్చాడు! నేను పెంచి పెద్ద చేశాను.

సుచిత్ర : (పరిమళంతో) నీవు కన్నతల్లివి కావా అమ్మా!

పరిమళం : కాదు తల్లీ! కన్నతల్లిని కాదు; 'అమ్మా' అని నన్ను పిలువకు! పాపిష్ఠురాలను!

అయోధ్య : పెంచి పెద్దచేసినదానవు ఈ పిల్లకు పెళ్ళిచేసి ఒక యింటిదాన్ని చేయలేకపోయావా?

రంగడు : మాకేం పట్టిందయ్యా? ఎంతో ఖర్చుచేసి పెంచి పెద్ద చేశాం. ఒక బంగారు వర్తకునకు పదివేలరూపా

యలకు అమ్ముకున్నాం! మేము చెప్పిందివినక రాత్రి పాఱిపోయి వచ్చింది!

ప్రసాద్ : ఈ అమ్మాయిని మీరు పతితను చేయదలుచుకున్నారు. నేను కాపాడి రక్షించాను. నేను పెళ్ళి చేసుకుంటాను.

రంగడు : అయితే ఆ పదివేల రూపాయలు మీరివ్వండి! అట్లాగే పెళ్ళి చేసుకోండి! ఎవరయితే మాకేం? మాకు కావలసింది డబ్బు!

అయోధ్య : అట్లాగే యిస్తాం తీసుకెళ్ళండి! కొంచెము సేపు ఆగండి!

[పోలీసు ఇన్‌స్పెక్టరుగారు ప్రవేశించుదురు]

ఇన్‌స్పెక్టరు : నమస్కారం అయోధ్య రామయ్యగారు!

అయోధ్య : నమస్కారం ఇన్‌స్పెక్టరుగారు!

ఇన్‌స్పెక్టరు : నాతో మీకు యేదో పనిబడ్డట్లువుంది! వీరంతా యెవరు? ఆ అమ్మాయి యెవరు? ఒరేయ్! రౌడీ రంగా! నీది వరంగల్ మకాంగదరా? ఆమె యెవరు?

రంగడు : మా అక్క పరిమళమండి!

అయోధ్య : వీరందరు మీకు తెలుసా?

ఇన్‌స్పెక్టరు : తెలుసు! ఈ రంగడు పాతకేడీ! ఎన్నోసారులు జైలుకెళ్ళి వచ్చాడు! ఈ పరిమళం వరంగల్లులో పేరుపొందిన పడుపుకత్తె.

అయోధ్య : ఇన్‌స్పెక్టరుగారు! మనం పదేళ్ళుగా వెదుకుతున్న శైలజ దొరికింది! (శైలజను చూపించి) ఈ అమ్మాయే శైలజ!

ఇన్‌స్పెక్టరు : ఎచ్చట దొరికింది?

అయోధ్య : ఇన్నాళ్ళకు మన అమ్మాయి వీరిదగ్గరే పెరిగింది. హనుమకొండలో బి.యిడి. ట్రైనింగు పొందుతున్న మా ప్రసాద్ తీసికొనివచ్చాడు.

ఇన్స్పెక్టరు : మీ శైలజ మీ అమ్మాయి కెట్లా దొరికిందో వివరంగా చెప్పండి!

అయోధ్య : వ్యభిచారవృత్తికి గతరాత్రి శైలజను వీళ్ళు నిర్బంధించారట! పారిపోయి మా అబ్బాయి గదిలోనికి వచ్చిందట! మా ప్రసాద్ కాపాడి తీసుకొని వచ్చాడు! వాడికికూడ శైలజ అని తెలియదు! బుగ్గమీద పుట్టుమచ్చ, కుడిభుజంమీద కాలిన మచ్చ చూచి మేమే గుర్తించాము! మీరింకా ఆరా తీయవలసివుంది

ఇన్స్పెక్టరు: అట్లాగేనండీ! (రంగడితో) అరే రంగా! ఉన్నది ఉన్నట్లు నిజంచెప్పు. లేకపోతే నీకారిద్దరికి జైలు కెళ్ళి శిక్ష అనుభవించవలసి వస్తుంది! పరిమళం. నిజం చెప్పు!

పరిమళం : నాకేం తెలియదు బాబూ! పదిసంవత్సరాల క్రితం మా రంగడు దిక్కులేని పిల్ల అని చెప్పి నాలుగేళ్ళ పిల్లను తెచ్చి నాకిచ్చాడు. అంతే! ఆ పిల్లను పెంచి పెద్దచేశాను. వృత్తిధర్మాన్ననుసరించి ఆ పిల్లను పదివేల రూపాయలకు నిన్న ఒక బంగారు వర్తకునికి అమ్ముతున్నాను! రాత్రి పారిపోయి వచ్చింది. ఈ బాబుగారు హనుమకొండలో అద్దెకున్న యింటియజమాని గోపాలరావుగారిద్వారా వీరి చిరునామా తెలుసుకొని యిక్కడికి వచ్చాం. అంతే!

ఇన్‌స్పెక్టరు : ఒరేయ్! రంగా! నిజం చెప్పు! ఈపిల్ల నీకు ఎక్కడ దొరికిందిరా?

రంగడు : పదేళ్ళ క్రిందట హైదరాబాదు ఎగ్జిబిషనులో దొరికింది. బాబూ! మెడలో పులిగోరులతో వున్న బంగారు గొలుసువుంది. ఆ బంగారు గొలుసును అమ్ముకొని త్రాగాను. పిల్లను తీసుకెళ్ళి వరంగల్లులో వున్న మా అక్క పరిమళానికి యిచ్చాను!

రాజన్న : అవును! పులిగోరులతో వున్న ఆ గొలుసును నేనే చేయించాను! ఆ గొలుసంటే ఎంతో సంబర పడేది. ఈ అమ్మాయి మన శైలజే నండీ! సందేహం లేదు. అమ్మా! శైలజా! (ముఖల కౌగలించుకొనును)

ఇన్‌స్పెక్టరు : ఒరే రంగా! ఒసే! పరిమళం! తహశీల్‌దారు గారి కుటుంబానికి యిన్ని కష్టాలు తెచ్చిపెట్టిన మీాకు ఎన్ని సంవత్సరాలు జైలుశిక్ష కావాలో చెప్పండి.

పరిమళం : బుద్ధి వచ్చిందండీ బాబూ! ఇక్కడ వున్నవాళ్ళం దరూ నన్ను క్షమించండి! అమ్మా! సుచిత్రా! కాదు, శైలజా! నా తప్పు క్షమించుతల్లీ! నీ వెన్నోసార్లు ఈ వ్యభిచార వృత్తి మానమని చెప్పావు; కాని నీమాట వినలేదు! అంతేగాకుండా నీకుగూడద్రోహం చేయ తలపెట్టాను. నాపాపాలకు శిక్ష లేదు!

ఇన్‌స్పెక్టరు : ఒసే పరిమళం! ఇదంతా నటన! నీ నాటకం యింక చాలించు!

పరిమళం : బాబూ! ఇన్‌స్పెక్టరుగారు! నాది నటనకాదు! నిజమే చెబుతున్నాను! రాత్రినుండి నాకు గుండెపోటు

వస్తున్నది. నాకు బుద్ధి వచ్చింది! ఈనాటినుండి యీ వృత్తి చేయను! నాకున్న ఆస్తినంత నా దగ్గరవున్న పిల్లలకు పంచిపెట్టి, యీ నీచవృత్తిని మానమని, ఏదైనా చాకిరీ చేసుకుని బ్రతికమని సలహా యిస్తాను!

అయోధ్య : నీ మాటలన్నీ నిజమని మే మెలా నమ్మడం?

పరిమళం : క్షమించండీ తహశీల్ దారుగారు! నేను చెబుతున్నది నిజం. ఈ ముసలితనంలో నన్ను జైలుకు పంపించకండీ బాబూ!

రంగడు : ఇన్ స్పెక్టరుగారు! కొన్నాళ్ళనుండి నాకళ్ళకు మసకలు వస్తున్నవి. చూపు మందగిస్తున్నది. నాపాపాలు నన్ను తరుముతున్నవి. యీ రోజునుండి రౌడీవృత్తి మానివేస్తున్నాను. కూలీగా జీవిస్తాను. ఇక్కడున్న వాళ్ళందఱు నన్ను క్షమించండి! చేతులెత్తి దణ్ణం పెడుతున్నాను! అమ్మా సుచిత్రా! కాదు.. శైలజా! నన్ను క్షమించు తల్లీ!

ఇన్ స్పెక్టరు : ఒరేయ్ రంగా! కొండంత తప్పుచేసి క్షమించమంటేసరిపోతుందా? నేరానికితగ్గశిక్ష అనుభవించాలి!

శైలజ : వీళ్ళను క్షమించండి మామయ్యా!

రాజ్యం : (భర్తతో) మన పిల్ల మనకు దొరికింది! వాళ్ళు చేసినపాపం వాళ్ళే అనుభవిస్తారు. వాళ్ళగతికివాళ్ళను వదిలివేయండి!

ప్రసాద్ : శైలజతో పాటు నేనుకూడ కోరుకుంటున్నాను నాన్నా! ఈ నేరస్థులను క్షమించండి.

అయోధ్య : (ఇన్ స్పెక్టరుగారితో) మన అమ్మాయి మనకు దొరికింది! ఈ నేరస్థులలోకూడ తగిన పశ్చాత్తాపం

కనిపిస్తూ వుంది! వారిని వదిలివెయ్యండి ఇన్‌స్పెక్టరు గారు!

ఇన్‌స్పెక్టరు : మీ రిపోర్టు వుండగా మేము వారిమీద కేసు పెట్టలేము! మీరు కోరినట్లుగా వారిమీద యెట్టి చర్య తీసుకోము లెండి! ఒరే శంగా! ఒసే పరిమళం! మీరు అదృష్టవంతులు! అయోధ్య వంటి హృదయులైన తహశీల్‌దారుగారు మీపై యెట్టి చర్యను తీసుకోవద్దని అంటున్నారు. ఇంక నీతిగా బ్రతకండి! మీరు మళ్ళీ మాటతప్పి నా దృష్టికి వచ్చారా ... కఠిన శిక్ష అనుభవిస్తారు! జాగ్రత్త! నేను వెళ్ళి వస్తాను అయోధ్య రామయ్యగారు! నమస్కారం!

అయోధ్య : నమస్కారం! మంచిది! వెళ్ళిరండి!

(ఇన్‌స్పెక్టరు నిష్క్రమించును)

పరిమళం : తహశీల్‌దారుగారు వెళ్ళివస్తాం బాబూ! నమస్కారం! ముసలితనంలో నన్ను జైలు కెళ్ళకుండా కాపాడారు! శైలజా! వెళ్ళివస్తాం తల్లీ!

అయోధ్య : మీ పదివేల రూపాయలు తీసుకెళ్ళరూ?

పరిమళం : నా కెందుకు బాబూ డబ్బు? నా ధనమంతా నా దగ్గరవున్న పిల్లలకు పంచిపెట్టి యెవరి పంచనన్నా బ్రతుకుతాను!

ప్రసాద్ : ఎవరిపంచనో యెందుకు? మా పంచన బ్రతుకుదువుగాని రా! మేము ఒకపాఠశాలను కొద్దిరోజుల తరువాత నడుపుతాం! ఉత్సాహకర్త్రిగా పనిచేయుదువుగాని!

పరిమళం : అంత భాగ్యమా నాకు? తప్పకుండా వస్తాను!

ప్రసాద్ : కాని ఒక షరతు!

పరిమళం : ఏమిటి బాబూ ఆ షరతు?

ప్రసాద్ : నీ కున్న ఆస్తి చిల్లిగవ్వతో సహా నీ దగ్గరున్న వారికి పంచిపెట్టి రావాలి!

పరిమళం : అట్లాగే బాబూ! అట్లాగే!

రంగడు : నేను కూడ వస్తాను! మరి నాకేం ఉద్యోగం యిస్తారు బాబూ!

ప్రసాద్ : మా పాఠశాలలో తోటపని కూడా వుంటుంది! తోటమాలిగా పనిచేయుదువుగాని నీవు కూడ రా!

రంగడు : అట్లాగే బాబూ! మమల్ని నరకంనుండి విముక్తి చెయ్యండి! వెళ్ళివస్తా బాబూ! వెళ్ళివస్తాం శైలజా!

(రంగడు, పరిమళం నిష్క్రమింతురు)

అయోధ్య : అమ్మయ్యా! ఇప్పటికి యీ యింటికి కళవచ్చింది! శైలజా! యిప్పటికి పదేళ్లనుండి మాకు శాంతి లేదు! నీ కోసం మెంతగానో పరితపించాము తల్లీ! ఇప్పటికి నీవు దొరికావు! ఈ యింటికి వెలుగు వచ్చింది.

శైలజ : ఇంతదుఃఖాన్ని మీకు గలుగ జేసిన నేను దురదృష్ట వంతురాలను మామయ్యా!

రాజ్య : దురదృష్టం అని యెందుకనుకోవాలి? గాకిదేవి మనలను పరీక్షించిందని భావిద్దాం! ఏమండీ! నేనీ సంతోషాన్ని భరింపలేకపోతున్నానండీ!

అయోధ్య : నేనుకూడ యీ ఆనందాన్ని భరింపలేకపోతున్నాను. గరళంలోనుండే అమృతం ఉద్భవిస్తుంది! వేదనలోనుండి పుట్టిన సుఖం యెంత మధురమో! అది అనుభవించినవారికే తెలుస్తుంది!

రాజ్య : ఇదంతా ఆ జగన్మాత కృపాకటాక్షం!
అయోధ్య : వెంటనే వీరిద్దరికీ పెళ్ళి చేయ్యాలి. నేటి సాయంత్రమే తిరుపతి ప్రయాణం! తిరుపతి దేవుని సాన్నిధ్యంలో వీరి పెళ్ళి జరగాలి.
రాజ్యం : మనబంధువులందరికి తెలియజేయవద్దూ ?
అయోధ్య : పెళ్ళి అయిన తరువాత మన బంధువులందరినీ ఆహ్వానించి విందుచేద్దాం!
ప్రసాద్ : నాన్నా ! నాకీ పెళ్ళి యిష్టం లేదు ?
అయోధ్య : ఎందుకనీ ?
ప్రసాద్ : ఈ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటే కులగోత్రాలు పోతవని మీరేగా చెప్పారు.
రాజ్య : ఓరి పిచ్చిగున్నా ! శైలజను నే చూడగానే చెప్ప లేదూ? పట్టుచీర కట్టుకుని పార్వతీదేవిలాగుందని! ఈ శైలజ మీ మేనమామ కుమార్తె! చిన్నప్పుడు మీరిద్దరూ యీ యింట్లో ఆడుకున్నారు.
అయోధ్య : వాడి మాటలకేం! అన్నీ వేషాలు! నాటకం ఆడుతున్నాడు! ఒరే ప్రసాద్! 'శుభస్య శీఘ్రం' అన్నారు పెద్దలు! శుభ కార్యాన్ని ఆలస్యం చేయ కూడదు! వంటపూర్తి అయ్యేలోగా పంతులుగారింటికి వెళ్ళి వస్తాను!
రాజ్య : పంతులుగారు శైలజను చూచి ఎంతగా మురుస్తారో !
అయోధ్య: వంట త్వరగా కానివ్వు! పంతులుగారింటికి వెళ్ళి వస్తాను! (అయోధ్య నిష్క్రమించును)

రాజ్య : అమ్మాయీ! శైలజా! వంటలు వార్పు నేర్చుకున్నావా ?

ప్రసాద్ : చక్కగా నేర్చుకున్నదమ్మా!

రాజ్య : అది నీకెలా తెలుసు ?

ప్రసాద్ : తానే చెప్పిందమ్మా! (శైలజతో) శైలజా! నీకు జీతం యెంతకావాలి ?

రాజ్య : ఓరి పిచ్చి గన్నా! పెళ్ళాని కెవరయినా జీతం యిస్తారా ? నోరుమూయ్! శైలజా! త్వరగా స్నానం చేసిరా! వంటపనిలో నాకు సాయం చేద్దువుగాని!

(రాజ్యలక్ష్మి నిష్క్రమించును)

ప్రసాద్ : శైలజా!

శైలజ : ప్రసాద్‌గారు!

ప్రసాద్ : ఇంకా ప్రసాద్‌గారు ఎందుకు ? ఈ యింట్లో నాకంటె నీకే యెక్కువ అధికారం వున్నట్లు కనిపిస్తూ వుంది. ప్రసాద్ అని పిలువు! చాలు!

శైలజ : అట్లాగే!

ప్రసాద్ : భర్త కావాలన్నావు, భర్త లభించాడు. పెళ్ళి కావాలన్నావు, పెళ్ళి అవుతోంది!

శైలజ : నన్ను పెళ్ళిచేసుకుంటానని ప్రతిజ్ఞ చేశారు. ప్రతిజ్ఞ నెఱవేరుతోంది.

ప్రసాద్ : ఇదంతా ఎవరి దయవలననో తెలుసా ?

శైలజ : ఎవరి దయవలన ?

ప్రసాద్ : జగన్మాత భద్రకాళి దయవలన! రాత్రి నీ నుదుట దిద్దిన కుంకుమరేఖ ఆ జగన్మాత చరణ

ధూళి! ఆ కుంకుమ రేఖలే మనలను ఈ విధంగా దగ్గఱకు జేర్చినవి.

శైలజ : ఆ సంగతి నాకు తెలియును. చిన్ననాటినుండి ఆ తల్లి నాకు ఆరాధ్యదేవత. పన్నెండుగంటలకాలంలో నా జీవితంలో ఎంత మార్పు జరిగింది!

ప్రసాద్ : నిన్ను కాపాడి తీసుకొచ్చినందుకేగా ఈ శుభ పరిణామం జరిగింది ! చల్లని నా హృదయాన్ని నీవు హరించావు, ఇందుకు నాకు నీవు ఏమిస్తావు ?

శైలజ : తియ్యని స్నేహం !

ప్రసాద్ : ఎప్పుడిస్తావు ?

శైలజ : పెళ్ళయిన మొదటి రాత్రి !

ప్రసాద్ : ఏ విధంగా ఇస్తావు!

శైలజ : జయదేవుని యష్టపదితో

ప్రసాద్ : ఏ అష్టపదితో?

శైలజ : "కురుయదునందన" అను అష్టపదితో!

ప్రసాద్ : ఇప్పటినుండే కాటుక, కస్తూరి, పువ్వులు, లత్తుక అన్నీ సిద్ధం చేసుకోవాలన్న మాట!

శైలజ : ఎందుకు?

ప్రసాద్ : అభినయానికి నీకు తగినట్లు పరిచర్య చేయడానికి!

శైలజ : (కోపంతో) చాలు సరసం!

ప్రసాద్ : శైలజా కోపంతో నీవు చూచినపుడు నీ ముఖం ఎలా వుందో తెలుసా?

శైలజ : ఎలా వుంది?

ప్రసాద్: కొలనిలో అప్పుడే వికసించిన ఎఱ్ఱతామరపువ్వులా వుంది. కోపంతో ముడివడిన నీ బొమముడి ఆ ఎఱ్ఱ తామరపై వ్రాలిన తుమ్మెదలా వుంది. (చేతులు పట్టుకొనును)

శైలజ: చాలు మీ వర్ణన! చేతులు వదలండి! అత్తయ్య పిలుస్తోంది.

(చేతులు వదిలించుకొని లోపలికి పరుగెత్తును)

ప్రసాద్: (సంతోషముతో పాటపాడును)

చింతయామి తదాననమ్
కుటిల భ్రూ కోప భరేణా!
శోణ పద్మమివోపరి
భ్రమతాకుల భ్రమరేణా!
హరి హరి హతాదరతయా!
సా గతా కుపితేవా!

(తెర వాలును)

[నాల్గవ రంగము - నాటిక సమాప్తము]

